# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు — మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 52
30-12-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

ఎటుచూచినా దోపిళ్లు దహనాలు - హత్యలు హాహాకారాలు - విధ్వంసాలు విషాదాలు

# భయంతో విలవిలలాడిన విజయవాడ!

విజయవాడ శాసనసభ్యుడు వంగవీటి మోహనరంగా దారుణహత్య, తదనంతరం మారణహోమాన్ని వర్ణించడం ఎవరి తరమూ కాదు. తెలుగుజాతి చరిత్రపుటలను రక్తపుమరకలతో మలినంచేసిన ఆ ఘోర, దారుణ, భీకర దుర్ఘటనంతో కోస్తాంధ్ర యుద్ధభూమి ఎట్లా వుంటుందో పుస్తకాల్లో చదవడం తప్ప మన మెవ్వరూ చూడలేదు; కాని ఈనాటి విజయవాడ మహానగర శిధిల స్వరూపాన్ని మించివుంటదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

పోలీసుల వేధింపులకు, ప్రత్యర్థుల

**◀ ఒక ప్రత్యక్ష కథనం ▶**

మొత్తం పెనుతుఫానులో చిక్కుడుటాకులాగా వణికిపోయింది. అగ్నిపర్వతంవలె బద్దలైంది. సెగలు పొగలు చిమ్మింది; వట్టిపగలే కటిక చీకటి క్రమ్ముకుంది; కట్టలు త్రెంచుకున్న ప్రజల క్రోధావేశాలు మహోద్యమంవలె, ఉప్పెనవలె, దావాగ్నివలె, క్షణాల్లో పెల్లుబల్లెనూ. ప్రతి పల్లెవాన్ని చుట్టుముట్టి కల్లోలం పాల్జేశాయి; రాబందుల రెక్కల చప్పుడుతో భీతిల్లి నాయి; పిశాచాల వికటాట్టహాసాలు వినిపించాయి. రుద్రభూమిని తలపించాయి; యుద్ధభూమిని మరపించింది.

దాటుమాటు కుట్రలకు బలిగిపోయిన మోహనరంగా 22 తేదీ నుంచి బందర్ రోడ్డులో నిరాహారదీక్షకు దిగాడు. ఆయన ప్రక్కన అనుచరులు దండిగా వున్నా, వారిచేతుల్లో కర్రలుకూడాలేకుండా పెరికి పారేశారు. ఆయనశిబిరం 'నిర్మలహృదయ భవన్' ప్రహరీగోడకు అనుకుని, గోడ ఎత్తులో కట్టారు. అందులో ఆయనతోపాటు దీక్షలో మరిద్దరు యువకులున్నారు. దానికి కొంచెం ప్రక్కన రోడ్డుపై రిలే దీక్షా శిబిరంలో పదిమంది అనుచరులున్నారు. వందగజాలదూరంలోనే రంగా ఇల్లుంది.



అక్కడా అనుచరులున్నారు. అయితే వీరెవరిలోనూ ప్రమాదభీతి లేకపోవడంతో అదమర్చి నిద్రిస్తుండినారు.

వేకువ 3.30 కి ఒకటో నంబర్ టవున్ బస్సు ఆదారిన మెల్లగా పోయిందట. శిబిరందగ్గర పరిస్థితి అంచనాకు వచ్చి వుంటుందది. పదిహేను నిమిషాల తర్వాత మరిరెండు బస్సులొచ్చాయట; ముందుగా పొగబాంబులు పడ్డాయట; ఆ వెంటనే పాతిక, ముప్పయిమంది కత్తులు కటార్లు పట్టుకుని దిగారట. కొందరు ఆ పొగలోనే శిబిరంపైకిఎక్కి దీక్షిత్ అనే విద్యార్థిని పొడిచారట. అతడు పెట్టిన కేకతో రంగా నిద్రలేచి పరుగెత్తబోయాడట. అయితే నాలుగురోజుల నుంచి తిండిలేని నీరసం, నిద్రమత్తు. ఎత్తుగావున్న వేదిక ఆయన్ను అయోమయంలోపెట్టి, కాలుజారి క్రింద పడ్డాడట.

ఒక్కసారి పైనపడి అందినచోటల్లా కత్తులతో పొడిచారట. కొందరు రంగాఇంట్లో దూరి బీభత్సం సృష్టించారట. శిబిరంలో నిద్రలోవున్న అనుచరులులేచి తెలదెలుసుకొనే లోపలే-ఐదంటే ఐదు నిముషాలలో. హంతకులను ఎక్కించుకొని బస్సులు పారిపోయాయట. ఆవెనుకే రెండు పోలీసు జీపులూ వాటిరక్షణగా కదిలాయనివదంతి!

అరగంట గడిచేసరికి హత్యావార్త విజయవాడనగరం మొత్తం గుప్పుమన్నది. ప్రజలు ఆగ్రహంతో భగ్గుమన్నారు. తమ అపురూపనాయకుని కోల్పోయామన్న ఆవేశం దావానలంగా అంటుకున్నది. వందలు, వేల సంఖ్యలో జనం ఇళ్ళు వదలి వీధుల్లోకి వచ్చారు. రంగాకు దెబ్బలు తగిలాయని కొందరంటే, చనిపోయాడనికొందరన్నారు. అంతా అయోమయం, గందరగోళం; ఎవరి ముఖాలలోనూ కళలేదు; ప్రతిఒక్కరూ క్రోధంతో కుత కుత ఉడికిపోతూ కన్పిం

-కొరవ 7వ పేజీలో

- **మన ఎస్. పి. పూర్ణచంద్రరావు భవనాలు నేలమట్టమైపోయాయి!**
- **మాగుంటసోదరుల గోడౌనలో కోటిరూపాయల ఆస్తి దోపిడిచేశారు!**

మోహనరంగా హత్యలో ముద్దాయిలుగా

# "ఎన్టీఆర్-హోంమంత్రి-ఎస్.పి. లను అరెస్టుచేసి కేసు పెట్టాలి"!

విజయవాడ కాంగ్రెస్ శాసన సభ్యుడు వంగవీటి మోహనరంగారావు దారుణహత్య ప్రజలను మహోద్రేకులను చేసింది; కన్నీళ్లు, కనపడితే కాల్చివేతవంటి కఠినతరమైన ఉత్తర్వులు వారి కోపాగ్నికి వటావంచలైపోయాయి; ఎక్కడికక్కడ పిడుగుల్లాంటి దేదీప్యమాన ఆయుధంతో ప్రతీకారానికి పూనుకున్నారు; ప్రభుత్వంపైన వర్షించిన ఆవేశజ్వాలలు విధ్వంసకరత్వలకు, హింసాత్మకకృత్యాలకు దారితీసింది. మోహనరంగా హత్యోదంతం ఆనాడు ఇంతా రాష్ట్రంలో పలుమూలలకు ప్రాకనేలేదు; అందరికీ తెలియనేలేదు; అప్పటికే. అంటే సోమవారం ఉదయం ఎనిమిదిగంటలకే. విజయవాడ నగరం, పరిసర ప్రదేశాలు ప్రజలకోపజ్వాలలతో మండిపోతున్నాయి. ఉదయం తొమ్మిదికి మోహనరంగా విషాద మరణవార్త అన్ని ప్రదేశాలలో అందరికీ తెలిసిపోయింది; ఎవరిపిలుపూలేదు. ఎవరి నుండి ఎటువంటి ఆదేశాలు సూచనలు లేవు; ప్రతి ఒక్కరే ఎవరికివారుగా అగ్నిశిఖలుగా, ఉక్కుపిడుగులా విజృంభించారు; బంద్‌లు, సమ్మెలు, సభలు... ప్రజాజీవనం స్తంభించిపోయింది. ఇంతటి ఉద్రిక్త వాతావరణాన్ని, ఇంతటి సెగలు పొగలుగా ఉద్ధృతమైన అగ్నిపర్వతపు పరిస్థితులను ఇటీవలి సంవత్సరాలలో ఎప్పుడూ చూడలేదు.

ఈ విషయంలో నెల్లూరుపట్టణమే, జిల్లాలోని ఇతరచోట్లకంటేకూడా వెనుకబడింది. నెల్లూరు పట్టణంలోకూడా కాంగ్రెస్ యువజనులు అక్కడక్కడ చెలరేగి హింసను పనికల్పించారుకాని, కాంగ్రెస్ పెద్దలు మాత్రం నిమ్మకంగా సాయంత్రం సంతాప సభకు తయారయ్యారు. సభకు ఒకగంట

## నెల్లూరు సభలో నిప్పులుకక్కుతూ ప్రసంగాలు

ముందేమైకుల్లో ప్రకటించారు సభ విషయం. ఆరుగంటలకల్లా ఇందిరా కాంగ్రెస్‌భవన ప్రాంగణం విషాద వాతావరణంలో జనసందోహంతో నిండిపోయింది. మోహనరంగా దారుణ హత్యోదంతం అతనిని తెలియనివారిలోకూడా ఎంతటిస్పందన కల్గించిందో, ఏవిధంగా కదిలించిందో సభాస్థలో కాంగ్రెస్ ఆఫీసువద్దకు చేరిన ప్రజలే నిదర్శనం.

జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, శాసన సభ్యుడు అయిన శ్రీ కె. వి. సుబ్బారెడ్డి అధ్యక్షించిన ఆ సంతాపసభలో ప్రతి ఒక్కరు నిప్పులుకక్కుతూ మాట్లాడారు. మోహనరంగా హత్య వారిని ఎంతగా కలిచివేసిందో, హృదయవేదన కల్గించిందో, క్రుంగదీసిందో, దుఃఖార్తులను గావించిందో ఉద్రేకపూరితము, వేదనాభరితమైన వారి ప్రసంగాలనుబట్టి చెప్పవచ్చు. తన ప్రాణరక్షణ కోరుతూ నిస్సహాయంగా నిరాయుధంగా నిరాహారదీక్షలో వుండిన ఒక శాసనసభ్యుని ప్రాణాలు కాపాడలేని ప్రభుత్వం ప్రభుత్వమే అనిపించుకోదని, అది అధికారంలో వుండడానికి అర్హత కోల్పోయిందని అన్నారు శ్రీ కె. వి. సుబ్బారెడ్డి. పొదలకూరు మండలాధ్యక్షుడు శ్రీ రావుల అంకయ్య గౌడ్ తెలుగుదేశం ప్రభుత్వంపైననే కాదు, ముఖ్యమంత్రి రామారావుపైనకూడా నిప్పుల వర్షమే కురిపించారు. మోహనరంగాహత్యలో ముఖ్యమంత్రి-హోం మంత్రి- విజయవాడ నగర ఎస్. పి. ముద్దాయిలని, వారిని అరెస్టుచేసి కేసు పెట్టాలని అంకయ్యగౌడ్ ఆవేశంగాసూచించారు. అడ్వకేటు శ్రీ పి. మధుసూదనరెడ్డి మరీ ఉద్రేకంగామాట్లాడేశాడు. ఆరోజు సాయంత్రంవరకు స్తబ్దుగా వుండిన జిల్లాకాంగ్రెస్ నాయకులమీద ఒకవిసురువిసురుకున్నాడు. కావలి ఎం.ఎల్.ఎ. శ్రీ కలికి యానాదిరెడ్డి రెచ్చిపోయి మాట్లాడారు; ఆయన ఉపన్యాసం వున్నదున్నట్లు వ్రాసే అవకాశం లేదు; వాతావరణానికి తగినట్లు వేడి వేడిగా వుండింది. ముఖ్యులైన కాంగ్రెస్

—తరువాయి 10వ పేజీలో

## పినాకిని తీరం

### పోగాలం దాపురించింది!

రాజకీయ నాయకులనుకాని, పార్టీలను కాని ఒకరు దించలేరు; ఒకరు పైకెత్తలేరు. గద్దెదించడం, ఎక్కించడం మానవ ప్రయత్నంతో సులభంగా జరిగేపనిగాదు. తమ నెత్తిన తామే దుమ్ముపోసుకుంటారు; తమ పతనాన్ని తామే కోరితెచ్చుకుంటారు. సేవ త్యాగచరిత్రగలిగిన పార్టీలు, నాయకులే తాము చేసిన తప్పులకు, పొరపాట్లకు తామే బలై పోతున్నారు. అటువంటప్పుడు కుక్కగొడుగులవలె పుట్టుకొనివచ్చి, మెరుపువలె ఒక వెలుగువెలిగే క్షణికమైన పార్టీల నాయకుల ప్రాభవం బుద్బుద ప్రాయం కావడంలో ఆశ్చర్యం ఏముంది?

పేదప్రజలకు ఎనలేని ఉపకారాన్ని చేసి, వారికి ఆత్మగౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కల్గించడంద్వారా వారికి సంఘంలో సమున్నతస్థానం ఇవ్వడంద్వారా 'అమ్మ'గా ఆరాధింపబడిన ఇందిరాగాంధీని, ఎమర్జెన్సీ మితిమీరిన అధికార దుర్వినియోగపు ఏకైక తప్పుకు ప్రధానిత్వంనుండి కాళ్ళుబట్టి ఈడ్చి క్రిందకొట్టారు ప్రజలు. జరుగుతున్నది గదా అని, ఆంధ్రప్రదేశ్‌లో ఐదేళ్ళకాలంలో నలుగురైదుగురు ముఖ్యమంత్రులను మార్చి, మితిమీరిపోయిన అవినీతిని అదుపులో పెట్టలేకపోయినందుకు కాంగ్రెసును శంకరగిరి మాన్యాలుపట్టించి, కాంగ్రెస్‌మీద కోపంతో సినిమా నటుడి చేతిలో మితిమీరిన అధికారాన్ని పెట్టారు. వ్యక్తిగత స్వార్థాలతో గిల్లికజ్జాలతో రెండేళ్ళలోనే అనైక్యమై అపభ్రంశంగా వ్యవహరించి అప్రతిష్ఠపాలై తమ ఆశలను వమ్ముచేసిన కేంద్రంలో జనతాపార్టీ ప్రభుత్వాన్ని కొరడాతో కొట్టి తరిమినట్లు అధికారం నుండి దించివేసి, ఏమైనా అమ్మే తమ ఆశాజ్యోతి అని భావించి మళ్ళీ ఇందిరాగాంధీకే పట్టాభిషేకం కట్టిపెట్టారు. ప్రజాస్వామ్యంలో ప్రజల అధికారం ప్రజలతీర్పు అంత అప్రతిహతమైనది, నిరంకుశమైనది, మొగమోటం ఎరుగనిది, తిరుగులేనిది!

అటువంటి ప్రజలు రాజకీయ చరిత్రహీనుడై అదృష్టంకొద్దీ అధికారానికివచ్చి తన్నుమిన్నుతెలియకుండా పరమ నిరంకుశంగా వ్యవహరిస్తున్న రామారావును ఇంకా సహిస్తారా? తెలుగుదేశం ప్రభుత్వానికి పోయేకాలం దాపురించింది; దానిని త్వరితము, నిస్సంశయము చేసిన తుది సంఘటన విజయవాడ శాసనసభ్యుడు వంగవీటి మోహనరంగారావు అమానుష హత్య; రాష్ట్రవ్యాప్తంగా చెలరేగిన నిరసన జ్వాలలు; పరిస్థితులను అదుపులోపెట్టలేని రాష్ట్ర ప్రభుత్వ విఫలత! గతవారం ఈ శీర్షికక్రిందనే తెలుగుదేశం పెట్టెబేడ సర్దుకోవలసిన సమయం ఆసన్నమైనదేమోనని యథాలాపంగా వ్రాసిన మాటలు ఈవారంలో అనూహ్యంగా ప్రాణం పోసుకున్నాయా అనిపిస్తుంది. వచ్చేవారానికి ఏ ఆకస్మిక ఆశ్చర్యకర పరిణామాన్ని వినవలసివస్తుందో ఎవరుచెప్పగలరు?

పతనానికిగాని, ప్రాభవానికిగాని అనుకూల ప్రతికూల పరిస్థితులు పరిణామాలు వాటంతటవి వస్తాయా? రావు. అది కాలగర్భంలో దాగివున్న రహస్యమో, లేక వ్యక్తుల జాతక ఫలితమోగాని- అనుకోని

-తరువాయి 8వ పేజీలో

# జమీన్ రైతు

## ఘోరం!

ప్రాణరక్షణలో ప్రభుత్వ సహాయానికి ప్రాధేయపడుతూ, స్వయంరక్షణకూడా నిరాకరింపబడి, ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిరసనగా గాంధేయమార్గంలో ప్రాయోపవేశం చేస్తూ గాఢనిద్రలోవుండిన విజయవాడ శాసనసభ్యుడు వంగవీటి మోహనరంగారావు, అతని సహచరులిరువురు అతి దారుణంగా పరమ పాశవికంగా కిరాతకంగా కసాయి తనంగా అమానుషంగా పొడిచి చంపబడటం ఘోరమైనవిషయం. ఈ దురంతాన్ని నాగరికలోకం తీవ్రంగా గర్హిస్తున్నది, నిరసిస్తున్నది, ఖండిస్తున్నది!

మామూలు పరిస్థితుల్లో అయితే మోహనరంగారావు హత్య ఇంత ప్రాధాన్యత వహించివుండేదికాదు, ప్రజలలో ఇంతటి కోపాగ్నిని రగుల్కొలిపివుండేదికాదు, ప్రతిఒక్కరి హృదయాన్ని ఇంతగా శోక పరితప్తం గావించివుండేదికాదు, ఇంతసానుభూతినీ పొందివుండేదికాదు. మోహనరంగారావు శాసనసభ్యుడైనందువల్ల, ప్రభుత్వ వ్యతిరేకమైన కాంగ్రెస్‌పార్టీకి చెందినందువల్లకూడా ఈ హత్య ఇంత అలజడిని ఆందోళనను అల్లకల్లోలాన్ని సృష్టించివుండేదికాదు. అతని ఇంటిలోనో, లేక మరెక్కడనో అదనుదొరకపుచ్చి హత్యచేసివున్నా అంతగా పట్టించు కొని వుండేవారుకాదు; ఇదేదో వ్యక్తిగత కక్షలవల్ల జరిగిందని కాసేపు నొచ్చుకొని సరిపెట్టుకొనివుండేవారు. కాని మోహనరంగారావు హత్యకు గురియైన పరిస్థితులు హృదయవిదారకమైనవి, విషాదదాయకమైనవి, అత్యంత దయనీయమైనవి. మోహనరంగారావు తనకు ప్రాణహాని జరుగుతుందనే భయంగావుందని, తగినరక్షణ ఇవ్వవలసిందని ప్రభుత్వాన్ని కోరాడు; ముఖ్యమంత్రికి స్వయంగా విన్నవించుకున్నాడు. కాని పోలీస్ అతని ప్రాణరక్షణకు తగినభద్రత చేకూర్చకపోగా, అతనిని, అతని అనుచరులను వేధించుకతిన్నారు; కడకు ఆత్మరక్షణకైనా వారివద్ద ఒక చిన్న శస్త్రపుల్లకూడా వుంచుకోనీకుండా నిషేధించారు; మోహనరంగారావువద్ద లైసెన్సు కలిగివున్న రివాల్వర్‌ను కూడా స్వాధీనపరచుకొని, అతనిని నిరాయుధుణ్ణి, నిస్సహాయుణ్ణి చేశారు. ఈ పరిస్థితుల్లో జరిగిన హత్య కాబట్టే ప్రజానిరసనజ్వాల వువ్వెత్తున లేచింది.

మోహనరంగారావు హత్యను కాంగ్రెస్‌వాదులు రాజకీయ ప్రయోజనాలకు వుపయోగపెట్టుకున్నారని తెలుగుదేశంవారు నిందిస్తున్నారు; తమ నేరాన్ని కప్పిపుచ్చుకోడానికి కాంగ్రెస్‌మీద అపవాదు వేస్తున్నారు. సామాన్య ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్న మోహనరంగా తెలుగుదేశానికి విజయవాడలోనేకాదు, సర్కారు జిల్లాలలో కంటకప్రాయుడుగా తయారైనాడు. అతని అడ్డును తొలగించుకొనిదే విజయవాడలోకాని, ఆ జిల్లాలలోకాని తమ పార్టీకి భవిష్యత్తులేదనే నిర్ణయానికొచ్చి, ప్రభుత్వం అతనికి తగినభద్రత ఏర్పాటుచేయకుండా, అతనివిరోధుల కసాయికత్తులకు అతన్ని ఆహుతి చేసింది! మోహనరంగా కోర్కెమేరకు అతని ప్రాణరక్షణకు భద్రతా ఏర్పాట్లు గావించివుండి, విధివంచితుడై అతను హత్యకు గురియైవుంటే ప్రభుత్వానికి ఈ అపవాదు వచ్చివుండేదికాదు; దానిని ఎవ్వరు వ్రేలెత్తి చూపగలిగివుండేవారుకాదు. కాని ఇప్పుడు తాను చంపకపోయినా, అతను హత్యగావింపబడడానికి ఉద్దేశ్యపూర్వకంగా అవకాశం కల్గించిందనే ఆరోపణను తెలుగుదేశం ప్రభుత్వం భరించకతప్పదు.

మోహనరంగారావుహత్య రాష్ట్రంలో-ముఖ్యంగా కోస్తాజిల్లాలలో-అరాజకానికి దారితీసింది. రాష్ట్రంలోని దాదాపు ముప్ఫయ్‌పట్టణాలలో ఒక్కసారి నిరవధికంగా కర్ఫ్యూ విధింపబడడం, అన్ని టవునులలో ఏకసమయంలో కనపడితే కాల్చుమనే వుత్తరువులు జారీఅయిన భయానక పరిస్థితి ఆంధ్ర ప్రదేశ్ పుట్టినతర్వాత ఎన్నడైనా ఎరుగుదుమా? తెలుగుదేశం ప్రభుత్వం తన అసమర్థతవల్ల ప్రజల ధన మాన ప్రాణాలను విధ్వంసకశక్తులకు అప్పగించి చూస్తూ కూర్చున్నది. కేంద్రంనుండి, పొరుగురాష్ట్రాలనుండి సాయుధదళాలు వచ్చినతర్వాత గాని పరిస్థితి అదుపులోకిరాలేదు. ఇటువంటి అసమర్థపు ప్రభుత్వం పక్షపాతపు ప్రభుత్వం ఏమాత్రం ఇంకా అధికారంలో కొనసాగితే రాష్ట్రం ఇంకెంతటి విపత్కర పరిస్థితులను ఎదుర్కొనవలసి వుంటుందో ఆలోచించడం అవసరం.

ప్రభుత్వ నిర్లక్ష్యానికి, రాజకీయ కార్పణ్యానికి ఆహుతులు గోల్పోయిన మోహనరంగారావు కుటుంబానికి; విధ్వంసక చర్యలలో ఆస్తులు, ప్రాణాలు కోల్పోయిన నిరపరాధులైన బాధితులకు మా సంతాప సానుభూతులు తెలియచేస్తున్నాము.

---

## జమీన్ రైతు

30-12-1938

20 పేజీలు అణా

### నెల్లూరుజిల్లా క్షామం

(సంపాదకీయం)

నెల్లూరుజిల్లా 1740 గ్రామాలలో నెల్లూరు - కోవూరు తాలూకాలలో ఏనూరు నూటయిరవై గ్రామాలుమాత్రం వరిపైర్లు పండుతవి. నాగాజిల్లా గ్రామాల్లో కొన్నిచోట్ల జపం కొద్ది ప్రదేశం కొన్నపైరు ఉన్నది. అదీ గూడ వర్షంలేకుంటే పండదు. మరి కొన్నిచోట్ల కొద్దిమంది తోటంపైర్లున్నవి. వర్షాలు తక్కువైనందున ఆ తోటంపుకూడా బావుల్లో నీరు సమృద్ధిగా ఉండటంలేవు. ఇక తక్కిన గ్రామాలలో మెట్ట-మాగాణి పైర్లన్నీ పూర్తిగా ఎండిపోయినవి. పశువులకు మేత, నీళ్ళుగూడాలేవు. రైతులకు-కూలీలకు తినడానికి తిండిలేక ఎక్కడి వారక్కడ మగ్గిపోతున్నారు.

### చిత్రపట ప్రదర్శనము

ఈనెల 28 తేదీన నెల్లూరులో వి. చంద్రశేఖరంగారిచే ఏర్పాటుచేయబడిన నెల్లూరు జిల్లా నాటక కళారాధకుల చిత్రపటముల ప్రదర్శనకు నెల్లూరు వాస్తవ్యులును, సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకుడును, ప్రఖ్యాత నటులును అగు శ్రీ వై. వి. రావుగారు ప్రారంభోత్సవము జరిపిరి.

### నెల్లూరు ముచ్చట్లు

(విమర్శకుడు)

పరిషత్ నాటకాలు

ఆహ్వానసంఘంవారి కృషికి వందనాలు.

మీరు తమకొర్చిన దరఖాస్తులను బట్టి, ములాజానుబట్టి నాటకాలు సెలెక్టు చేశారేగాని ఉత్తమ నటకులనాహ్వానించి వారిచేత ప్రదర్శింపచేద్దామనుకోలేదు.

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

ఆంధ్ర సినిమా ఆకాశంలో వెలిగే ఒక్క తారాగూడా కళాపరిషత్తును స్పృశింపలేదు.

కన్నాంబ - కాంచనమాల - కాంతకుమారి - కోటిరత్నం - రామతారారి - స్థానం - డి. వి. - అద్దంకి - బందా - ఇత్యాదుల నాహ్వానించి కొన్నినాటకాలు ప్రదర్శింపజేసియుంటే ఎంతో బాగుండేదిగదా?...........

ఓ గుడ్డి పరిషత్తా! మీరాబాయిలాంటి ఉత్తమ నటవర్గాన్ని కాలతన్ని బజారు కంపలన్నీ కౌగలింతావా? అక్కా!

### సుందరయ్య నామినేషన్ కొట్టేశారు.

పుచ్చలపల్లి సుందరయ్య, వేమూరు లక్ష్మయ్య, మేడా రామన్నయ్య అనే ముగ్గురు అఖిలభారత కాంగ్రెస్ ప్రతినిధి ఎన్నికకు 9 వ నియోజకవర్గం (అంగానిపాడు వగైరా గ్రామాలు) నుండి నామినేషను వేశారు. 27 తేది నామినేషను, 28 తేది పరిశీలన. ఆ రోజు కొన్నిమాత్రం పరిష్కరించ రాదు. సుందరయ్య, ఏనుగ రాఘవరెడ్డి, రామానాయుడు మొదలగు కొన్ని మాత్రం నిలిపిపెట్టి బొమ్మారెడ్డి గారు అరాత్రి బందరు వెళ్ళారు. ఏమి సంప్రదింపులు జరిగాయో తెలియదు. 30 తేది ఉదయం తక్కినవి వున్నవి వున్నట్లే తీర్మానించారు. సుందరయ్య నామినేషను మాత్రం కొట్టేశారు. సుందరయ్య కమ్యూనిస్టు క్రింద తీర్మానించి కొట్టివేశారట. ఆక్షేపించింది వేమూరు లక్ష్మయ్యపంతులు. వడ్డితు రాఘవయ్యద్వారా జరిగిందని మా నమ్మకం.

సుందరయ్య ఆంధ్ర రాష్ట్ర సోషలిస్టు పార్టీ కార్యదర్శి. ఆ పక్షపత్రిక "నవశక్తి" కి సంపాదకుడు. అంతేకాని కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు గాదు. ఆపార్టీ ఆంధ్రరాష్ట్రంలో అసలులేదు. సుందరయ్యను శిక్షించిన ప్రభుత్వం గాని, విడిపించిన ప్రభుత్వంగాని యితన్ని కమ్యూనిస్టుగా భావింపలేదు.

---

# పదవిలో వుండడం పరువుతక్కువకాదా?

విజయవాడ శాసన సభ్యుడు వంగవీటి మోహనరంగాహత్య, తదనంతరం నాలుగు కోస్తా జిల్లాలలో చెలరేగిన అరాజక పరిస్థితులు ఆంధ్రరాష్ట్ర చరిత్రనే రక్తపంకిలం చేశాయి. తెలుగుదేశంప్రభుత్వపు కుట్రల, కుటిల విధానాల ఫలితంగా కులరాజకీయాలకు ప్రాధాన్యత లభించి సామాజిక వాతావరణమే కలుషితమైపోయింది.

ఇంత అరాచకం తలెత్తితే, ఇన్ని ప్రాణాలు అన్యాయంగా బలైపోతే, ఇన్ని వందల కోట్ల రూపాయల ఆస్తిపాస్తులు అగ్నికి ఆహుతైతే-చూస్తు ఊరుకోవడం తప్ప ఏమీచేయలేని నిస్సహాయతతో, చేతగానితనంతో చేతులుముడుచుకున్న రాష్ట్ర ప్రభుత్వం ఇంకా కొనసాగటంకంటే, పెద్ద నేరమేమీ వుండదు. కోస్తా జిల్లా లంతటా మారణహోమం జరుగుతుంటే కనీసం పరిస్థితిని స్వయంగా చూడడానికి అక్కడకు వెళ్ళనుకూడా వెళ్ళలేని పిరికిపందలాగా వ్యవహరించాడు హోం మంత్రి, డి జి పి! లక్షమందిపైనున్న పోలీసుబలగానికి అధినేత అయిన డి జి పి యే, తనకు భద్రత లేదనే భయంతో గాజులుతొడుక్కొని హైదరాబాదులో పోలీసు కాపలా మధ్య కాలంగడిపితే, ఇక ఆయన ప్రజలకేమి రక్షణ కల్పించగలడు?

తమ చేతీయులా సృష్టించుకున్న విషమ పరిస్థితులను అదుపుచేయలేక చేతులెత్తివేసిన ముఖ్యమంత్రి, హోం మంత్రి, డి జి పి ఇంకా తమ పదవులు పట్టుకొని వ్రేలాడడం సిగ్గుచేటు. అది తెలుగు ప్రజలకే పరువు తక్కువ! తక్షణం వారిచేత రాజీనామా ఇప్పించడానికి ప్రజలుద్యమించడం అవసరం!

నెల్లూరు —పి. సుబ్బారావు.

### చలానాల అమ్మకం

కాలేజీఫీజులు, పరీక్షఫీజులు కట్టడానికి ట్రెజరీ చలానా ఫారాలు కావాలి; అవి ట్రెజరీలో వుండవు, బ్యాంకులలో సూ వుండవు; వాటి ప్రక్కన టీ బంకుల్లో, జెరాక్స్ సెంటర్లలో ఒక్కొక్కటి రూపాయికి అమ్ముతారు; విద్యార్థులకు

జనవాణి

ఉచితంగా ఇవ్వవలసిన చలానా ఫారాలు ఇట్లా అమ్ముతౌతుంటే ప్రభుత్వం చూస్తూ ఊరుకుంటుందేమి? ఫీజు అప్లికేషన్‌తోపాటు చలానాఫారంకూడా కాలేజీలోనే ఇచ్చే ఏర్పాటు చేయకూడదా!

—ఒక విద్యార్థి

### కోవూరులో స్టాంపుల కొరత

కోవూరులో స్టాంపుల కొరత తీవ్రంగా వుంది. కరెంటుసర్వీసులీసుకోడానికి అగ్రిమెంటు వ్రాసిచ్చేందుకు, రైతులు పొలం,

—కొరవ 7వ పేజీలో

### ఆగిపోయిన కావలి టీచర్ల నియామకాలు

# నిరుద్యోగుల జాబితాకు నాలుగు నెలలు పట్టాలా?

కావలి మునిసిపాలిటీలో దాదాపు పాతిక ఉపాధ్యాయ ఉద్యోగాలు ఖాళీగా వున్నాయి. ఎలిమెంటరీ స్కూళ్ళనుంచి, హైస్కూళ్ళ వరకు ఇదే పరిస్థితి. అయితే ఉపాధ్యాయ నియామకాలపై కోర్టులోని కేసులు, ఏకీ వివాదం, అనర్హుల నియామకాలపై ప్రభుత్వ నిషేధం రావడంతో నాలుగేళ్ళ క్రితం భర్తీ కావలసిన అయ్యవార్ల పోస్టులు ఎక్కడివక్కడే ఆగిపోయాయి.

ఇప్పుడు ప్రభుత్వం వాటిని భర్తీ చేసేందుకు అనుమతిచ్చిందట. రెండు వర్గాలూ నియామకాలపై ఒక రాజీ కుదుర్చుకుని పంపకాలు పెట్టుకున్నారట. ఇది జరిగి నాలుగు నెలలైంది! అప్పటినుంచి ఇప్పటివరకు ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజి జాబితామాత్రం అభ్యర్థుల దాకా పంపడం లేదట; టెలిగ్రామ్ లిచ్చినా, స్వయంగా వెళ్ళి ప్రతిమలాడినా "వారంలోపల పంపుతాము" అనే రికార్డు జవాబు తప్ప పంపింది లేదట. తమ పేర్లు పంపడానికి కాలయాపన చేయడం అభ్యర్థులు ఎక్ఛేంజి సిబ్బంది చేతులు తడపకపోవడమే ఈ ఆలస్యానికి కారణమంటారు. ఫలితంగా నియామకాలు నిల్చిపోయాయి; విద్యాసంవత్సరం గడిచిపోతున్నా అయ్యవార్లు లేకుండా స్కూళ్ళు జరిగిపోతూనే వున్నాయి! తల్లిదండ్రులు, విద్యార్థులు ఎంతలా తిరిగి తోసుకున్నా ప్రయోజనం కనిపించలేదు.

రెడీగావున్న లిస్టులో నుంచి పంపటానికి రెండువందలలో పేర్లు పంపడానికి నెలల కాలం పట్టాల్నా? ఏమిటీ దయంలేనితనం?

### విశ్వోదయ వార్షికోత్సవం

విశ్వోదయ హైస్కూలు 28 వార్షికోత్సవం డి.ఇ.ఓ. శ్రీ ఎం. జాలాతీసింగ్ అధ్యక్షతన జరిగింది. పాఠశాల ప్రవేశ ద్వారానికి శ్రీ శివారెడ్డి రిబ్బను కత్తిరించారు.

ఆ సభలోవున్న కావలీయుడు డాక్టర్ టి. శివశంకర్ దీనికి ప్రారంభం చేశారట. రంగుల విద్యుదీకరణకు స్కూలు యాజమాన్యం మరో 6 వేలు వెచ్చించింది.

సభలో డిప్యూటీ డి. ఇ. ఓ. శ్రీ కె. హనుమంతరావు, కరస్పాండెంట్ డాక్టర్ కృష్ణారావు, హెడ్మాష్టరు శ్రీ కుమారస్వామి తదితరులు పాల్గొన్నారు.

### వింజమూరు సంతాపం

తైరపరం బ్రాంచి పోస్టుమాష్టరు శ్రీ ఎల్.వెంకటసుబ్బయ్య మృతికి సంతాపంగా వింజమూరు సబ్ ఆఫీసు ఉద్యోగులు ఒక సభ పెట్టారు. శ్రీ నారాయణమూర్తి అధ్యక్షత వహించారు; శ్రీ ప్రతాప్, శ్రీ పి. సుందరరామయ్య, శ్రీ వి. వి. సత్యనారాయణ తదితరులు మాట్లాడారు.

## జిల్లావార్తలు

### "పాఠం అర్థంకాకుంటే ట్యూషన్ చెప్పించుకోండి..."

...అంటున్నారట అల్లూరు రామకృష్ణ జూనియర్ కాలేజి అయ్యవార్లు. అల్లూరు చుట్టుప్రక్కల పదులసంఖ్యలోని గ్రామాలకు ఎంతో కీలకమైన కళాశాల ఇది. ఈ హైస్కూలులో చదివినవారు దేశవిదేశాలలో ఎంతో ఉన్నత స్థానాలలో వున్నారు.

అటువంటి ప్రాధాన్యత కల్గిన ఈ కళాశాల ఇటీవల పరమ అధ్వాన్నంగా తయారైందని కొందరు గ్రామస్తులు వాపోతున్నారు. ఈ ఏడాది 270 మంది విద్యార్థులు 10 తరగతి పరీక్షకు హాజరైతే 40 మంది పాసైనారట. ఇంగ్లీషు, లెక్కల వంటి సబ్జక్టులు క్లాసుల్లో సరిగ్గా చెప్పరట. గ్రామంలో ఆ య్యవార్ల సహకారంతో నడుస్తున్న నాలుగు ట్యుటోరియల్ కాలేజీలుమాత్రం మూడుపూలు ఆరుకాయలుగా వున్నాయంటున్నారు. పిల్లలు పాఠం అర్థం కావడంలేదంటే, వాటిలో ట్యూషన్లకు చేరమని రికమెండ్ చేస్తున్నారని ఒక ఆరోపణ.

నూరేళ్ళ చరిత్ర కల్గిన వి ఆర్ కాలేజి అనే ట్యూషన్ల నే ఎయిడ్స్ రోగంతో కృంగి, కృశించిపోయింది; ప్రిన్సిపాల్, గ్రామ పెద్దలు కలిసి రామకృష్ణ జూనియర్ కాలేజికి ఆ దురవస్థ రాకుండా మొదట్లోనే జాగ్రత్తపడటం మంచిది!

### చంద్రశేఖరపురం రోడ్డు దుస్థితి

కొండపలూరుమండలంలోని చంద్రశేఖరపురం గ్రామంలో సరియైన రోడ్డుసౌకర్యం లేనందువల్ల ప్రజలు చాల అవస్థలు పడుతున్నారు. ఈ గ్రామానికిపైన ఎక్కువ భాగం అటవీప్రాంతం అవడంవల్ల ఈ వర్షాకాలంలో అడవిలోని నీరంతా ఈ గ్రామంలోకి ప్రవేశించి జలమయమైపోతున్నది. అందువల్ల ఈ గ్రామంలో నడవాలంటేనే భయమేస్తోంది. ఈ విషయమై అధికారులకు ఎన్నో విన్నపాలు పంపుకున్నా ఫలించలేదట. ఈ గ్రామానికి రోడ్డుమాత్రం వేస్తే సరిపోదు. దీని ప్రక్కనేవున్న జాతీయ రహదారిలో కలిసేటట్లు వంతెన నిర్మాణం కూడాచేపట్టాలి.

### బుచ్చి జూనియర్ కాలేజి వార్షికోత్సవం

బుచ్చిరెడ్డిపాలెం ప్రభుత్వ జూనియర్ కళాశాల వార్షికోత్సవం 15 తేది జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ పూర్ణచంద్రరావు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ స్వరూప్ సభను అధ్యక్షించారు. వింజమూరు జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ రాజా సత్యనారాయణ తదితరులు ప్రసంగించారు. వ్యాసరచనపోటీల్లో గెలుపొందిన విద్యార్థులకు డాక్టర్ బి. వి. కృష్ణారెడ్డి బహుమతి ప్రదానంచేశారు.

### మైపాడు ఆస్పత్రిని తరలించడం అన్యాయం!

మైపాడులోవున్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ఇందుకూరుపేటకు తరలించారట. ఇది అన్యాయమని ఆ గ్రామస్తులు విమర్శిస్తున్నారు.

మైపాడు సముద్రతీర గ్రామం. ఇటు కుడితిపాలెం నుంచి అటు వెంకటపాలెం వరకు వున్న వేలాది మత్స్యకార కుటుంబాలకు ఈ ఆస్పత్రే ఆధారం. 1980 నుంచి పనిచేస్తున్న ఈ ఆస్పత్రిని హఠాత్తుగా ఎత్తివేయడంతో వారందరూ ఇప్పుడు వైద్యంకోసం నెల్లూరుకు రావలసిన అగత్యం ఏర్పడుతుంది. ఇందుకూరుపేటలో లోకల్‌ఫండ్ ఆస్పత్రి వుంది. దాన్ని అభివృద్ధిచేసినా సరిపోయేదికదా అంటారువారు. ఇప్పటికైనా జిల్లా పెద్దలు జోక్యం చేసుకుని తమకున్న సౌకర్యాన్ని నిల్పాలని వీరు కోరుతున్నారు.

కొరవ 10వ పేజీలో

# కోటి రూపాయలు విలువచేసే ప్రభుత్వ భూమికి జి ప ఛేర్మన్ దేగా నారసింహారెడ్డి దోటి?

ఒక స్కూలు పేరుతో ఐదువైఐదెకరాల విలువైన స్థలం సంపాదించడానికి జిల్లా ప్రజాపరిషత్ చేర్మన్ శ్రీ దేగా నారసింహారెడ్డి చేసిన ప్రయత్నం రెవిన్యూ అధికార్ల అప్రమత్తతవల్ల బెడిసికొట్టింది. నారసింహారెడ్డిగారికి నెల్లూరులో ఒక ప్రతిష్ఠాత్మకమైన స్కూలు నెలకొల్పాలనే ఆలోచన చాలాకాలంనుండి వుంది. పరిషత్ ఎన్నికలకు ముందునుంచే ఆయనామాట చెప్తుండేవారు. అయితే ఎందువల్లనో అది మాటల స్థాయినుంచి చేతల రూపంలోకి రాలేదు.

ఈ స్కూలు పేరిట దేగా నారసింహారెడ్డిగారు తన సతీమణి శ్రీమతి కాంతమ్మ పేరిట బుజబుజనెల్లూరులో ఐదువైఐదు ఎకరాల ప్రభుత్వస్థలానికి దరఖాస్తు చేశారట. దాని విషయంలో ప్రతిపాదనలు పంపమని ముఖ్యమంత్రి స్థాయినుంచే కలెక్టర్లపైన ఒత్తిడితెచ్చారట. అయితే పాత కలెక్టర్ డాక్టర్ ప్రశాంత మహాపాత్ర, ప్రస్తుత కలెక్టర్ శ్రీ కె. రాజు లిద్దరూ దానికి సమ్మతించలేదు. ఆ స్థలం టౌన్‌లోని మురికివాడలు, రోడ్డు దురాక్రమణలలోవున్న బలహీనవర్గాలవారికోసం కేటాయించి వున్నామని, అందుకు తగిన లేఔట్ కూడా మంజూరై వుందని కలెక్టర్లు ప్రభుత్వానికి చెప్పారట.

అప్పటినే నారసింహారెడ్డిగారు వెంటనే దాని సమీపంలోనే మరో ఐదు ఎకరాల స్థలానికి దరఖాస్తుచేశారు. అయితే దానిని ఏ పి ఐ ఐ సి సంస్థ ఇదివరకే కోరివున్నదని, అందువల్ల స్కూలుకు ఇవ్వడం వీలుకాదని అధికార్లు ప్రభుత్వానికి సమాచారం అందించినట్లున్నారు. ఆ ఫైలు

#### ముఖ్యమంత్రి పత్తిడి- కలెక్టర్ల తిరస్కృతి?

ఇప్పుడు పెండింగులో పడిపోయిందట హైదరాబాదునుంచిమాత్రం తరచు ఇక్కడి అధికార్లకు రిమైండర్లు వస్తున్నట్లున్నాయి.

నెల్లూరుజిల్లాలో ఉన్నతప్రమాణాలతో ఒక ప్రతిష్ఠాత్మకమైన స్కూలును నెలకొల్పాలనే ఉద్దేశం మంచిదే. తమపిల్లలకు మంచి చదువులు చెప్పించాలనే ఆశ కల్గిన మధ్యతరగతి కుటుంబీకులకు అది ఉపకరిస్తుంది. అయితే వ్యాపార పరంగా నిర్వహించే విద్యాసంస్థలకు ప్రభుత్వ స్థలం సంపాదించాలనే ఆలోచనే సమంజసంకాదు. నెల్లూరులో ఇప్పటికే ఎన్నో ఇంగ్లీషు స్కూళ్ళు, పెద్ద పెద్ద పెట్టుబడులతో పెట్టారు. వాటికి లేనిది సర్కారు స్థలాలివ్వ

—కొరవ 10వ పేజీలో



"ధర్మయుద్ధం-లో" డాక్టర్ రాజశేఖర్, రజిని

# భారీతనంతో నిర్మాతకు ప్రేక్షకుల గుర్తింపువస్తుందా?

వ్యాపారంకంటే మిన్నగా గ్లామర్ కోసం సినిమారంగ ప్రవేశంచేసిన తిక్కవరపు సుబ్బరామరెడ్డి ఇప్పుడు ఒక పెద్ద గ్లామర్ చిత్ర నిర్మాణమే తలపెట్టాడు. భారత దేశంలోనే పేరొందిన గ్లామర్ నటుడు కమలహాసన్‌తో భారీచిత్రం నిర్మిస్తున్నా రాయన. ఆ చిత్రం భారీతనానికి తగినట్లే డైరెక్టర్‌గా కూడా ఎ. కోదండరామిరెడ్డిని నియమించారట. డబ్బు లెక్కచేసే గత్యంతరం లేని నిర్మాత దొరికితే కోదండరామిరెడ్డి తన చిత్రంలో ఎన్ని చమక్కులు సృష్టిస్తాడో ప్రత్యేకంగా చెప్పాలా? 1989 చివరలో విడుదలౌతుంది సినిమా!

సినిమాలతో సంపాదించాలనే ఆశ, అవసరంలేని సుబ్బరామిరెడ్డిగారు, పూర్తి వ్యాపారాత్మకమైన చిత్రాలు తీయడ మెందుకో అర్థంకాదు. ఆయనకు కావలసింది డబ్బుకంటే ముఖ్యంగా పేరు, ప్రచారం! డబ్బు లేదని మేము చెప్పం కాని, అందుకు ఆ వ్యాపారమే చేయాల్సిన

**తిక్కవరపు సుబ్బరామరెడ్డి, మాగుంట సోదరులు తీయాల్సిన చిత్రాలు ఇవేనా?**

అగత్యం ఆయనకు ఏముంది? ఏ సంపన్నుడైనా చేయవలసింది ప్రేక్షకులకు చిరకాలం గుర్తుండే చిత్రాలు తీయడం. యానాది చిందులకంటే చవకబారు డ్యూయెట్లుపెట్టి, మసిలయుద్ధాలు సృష్టించి, అదేసినిమాఅని జనంపైకి తోలే సగటు నిర్మాతలకు ఆయనకు ఏమిటి తేడా?

సమకాలీన జీవిత వాస్తవాల చిత్రీకరణ ప్రజలనెట్లాఆకట్టుకుంటుందో రామోజీరావు చేసిచూపించారు; 'ఈ నాడు' కంటేఅధిక ప్రచారం సంపాదించారు! కళాత్మకవిలువలంటే జనం ఎట్లా పడిచస్తారో విశ్వనాథ్ తీసిచూపించారు. తెలుగుపత్రికలలో ప్రత్యేక గుర్తింపుపొందారు. వ్యాపారంకోసం అసభ్యత, అవాస్తవికతలను పెంచిపోషించవలసిన అగత్యంలేదని వస్తువ్యాపార దర్శకులు బాలచందర్, మణిరత్నమూడులు నిరూపించారు. వారిసినిమాలంటే ప్రేక్షకులకు తెగని అభిమానం! ఈ విషయాలు

—కారవ 11వ పేజీలో

## గోపాలరెడ్డికీ ఖర్చు పిచ్చి!

పొదుపుగా, మంచి ప్లానింగ్‌తో, ఎక్కడా ఏలోటూ కన్పించకుండా మంచి వ్యాపారచిత్రాలు తీసే ఎస్. గోపాలరెడ్డి కూడా భారీచిత్ర నిర్మాణమనే ఊబిలో పడిపోయారు. ఆయనిప్పుడు తీస్తున్న 'ముద్దులమావయ్య'కు వెనుకాముందు చూడకుండా ఖర్చు పెడుతున్నారట. పాటలు, ఫైటింగులకోసం ఆయన వేస్తున్న సెట్టింగులు కళ్ళు చెదరగొడుతున్నాయంటున్నారు. కోడి రామకృష్ణ దర్శకత్వం వహించే ఈ చిత్రానికి నెల్లూరు యువ రచయిత శ్రీ వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్ కొన్ని పళ్ళుపులిసే పాటలు వ్రాస్తున్నారు. బాలకృష్ణ, విజయశాంతి నటీనటులు. ఇప్పుడు హిందీప్రేక్షకుల పొత్తంతో చేయ దానికి బొంబాయికి తరలివెళ్తున్నారు ★

## మద్రాసు సినిమా వార్తలు

**జగపతివారి జెయింట్ చిత్రం**

ఒకప్పుడు మంచి చిత్రాలే అందించిన పాత నిర్మాణసంస్థ జగపతి ఆర్ట్‌పిక్చర్స్ ఇప్పుడొక జెయింట్ చిత్రం నిర్మిస్తోంది. ఆసంస్థ అధిపతి శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ తన కుమారుడు జగపతిబాబు ఆరంగేట్రం కోసం నిర్మిస్తున్న ఈ 'సింహస్వప్నం' ఖర్చు కోటిన్నర దాటుతున్నదట. దీనికోసం వేస్తున్న సెట్స్ ఒక్కోటి ఆరేడు లక్షలు వేస్తుందని పరిశ్రమలోని వారి కథనం. ఈ భారీచిత్రం ఫిబ్రవరిలో విడుదలౌతుంది!

**హిందీ సీమలో పరుచూరి బ్రదర్స్**

ఎడమచేతితో వ్రాసేది కుడిచేతికి తెలియకుండా, ఎడాపెడా సినిమా కథలు, స్క్రీన్‌ప్లేలు వ్రాసిపడేస్తూ తెలుగుప్రేక్షకుల ఓర్పును, సహనాన్ని పరీక్షిస్తున్న ప్రసిద్ధ రచయితలైన పరుచూరి బ్రదర్స్



జననం : 13-9-1927
మరణం : 19-12-1988
చీదెళ్ళ సుబ్బరామయ్య

# శ్రద్ధాంజలి

మా అభివృద్ధి కారకుడు

## చీదెళ్ళ సుబ్బరామయ్యగారు

శ్రీరామా రైస్‌మిల్-చెట్టిగుంటరోడ్-నెల్లూరు.

19-12-88 తేది సోమవారం స్వర్గస్తులైనారు.
వారి ఆత్మకు శాంతి చేకూర్చమని భగవంతుని
ప్రార్థిస్తూ, వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

కుమారులు : చీదెళ్ళ వెంకటేశ్వర్లు, శేషగిరిరావు, రమేష్, సురేష్
కుమార్తెలు : కూరపాటి సుశన్మ, వాకాటి సుజాత, సోమిశెట్టి ఉషారాణి
కోడళ్ళు : సుశీల, సుజాత, శిరీష
అల్లుళ్ళు : కూరపాటి రామారావ్, వాకాటి రాము, సోమిశెట్టి శ్రీనివాసరా[illegible]
మనుమళ్ల : కిషోర్, వినోద్, రాజేష్
మనుమరాలు : లక్ష్మి